# ఆంధ్రపత్రిక

316914



The Andhra Patrika, Madras, } Regd No. 1118, Vol, 34 No. 142 TUESDAY 16th SEPTEMBER 1947 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao

## మైసూరు సంస్థానంలో ప్రజా సమూహాలపై పోలీసు కాల్పులు

### ముగ్గురు మరణించారు
### పదిమంది గాయపడినారు

బెంగుళూరు, సెప్టెంబరు 14: బెంగుళూరుకు 40 మైళ్ల దూరములో ఉన్న తుంకూరుపట్టణములో ఈరోజు సాయంత్రము పోలీసులు తుపాకులు కాల్చినందువల్ల ఇద్దరు చనిపోయినారు. పదిమంది గాయపడ్డారు. పెద్ద జనసమూహము తుంకూరు తాలూకా ఆఫీసు మీదకు పోయింది. పోలీసులమీద రాళ్లు రువ్వినారు. అప్పుడు పోలీసువారు తుపాకులు కాల్చినారు.

### రాజనగర్‌వద్ద తీవ్రమైన బందోబస్తు

ఈరోజున మైసూరు మహారాజాభవనము ఎదట సత్యాగ్రహము చేయవలెనని లోగడ కాంగ్రెసువారు నిర్ణయించినారు. అందువల్ల అటువంటి పనులేమీ జరగనీయకుండా ఉండేటందుకు ఈరోజున రాజనగరు ఎదటనూ, మైసూరునగరము అంతటనూ పోలీసువారున్నూ మిలటరీవారున్నూ అతి గట్టి బందోబస్తు చేసినారు. ఆపోలీసులనూ మిలటరీని తప్పించుకొని నగరములోకి పోవడము అసంభవము అయ్యేటట్లు చేసినారు. అతిపకడ్బందీగా కర్ఫ్యూ శాసనం అమలు పరిచినారు.

### బెంగుళూరు

బెంగుళూరు నగరములో కర్ఫ్యూ శాసనం అమలులో ఉంది. అందువల్ల సత్యాగ్రహ సందర్భము ఏమీలేదు. అయితే కాంటోన్మెంటు ప్రాంతములో "మైసూర్ ఛలో" అంటూ బయలుదేరిన ఒక జట్టును అరెస్టుచేసినారు. ఈ జట్టులో నల్గురు స్త్రీలు ఉన్నారు. వారిలో చంకబిడ్డతో ఉన్న ఒకతల్లి కూడా ఉంది.

### తాతాచార్యశర్మ అరెస్టు

"విశ్వకర్ణాటక" అనే కన్నడ వారపత్రిక సంపాదకుడు టి. తాతాచార్యశర్మను పోలీసులు అరెస్టు చేసినారు. ఆయన మైసూరులో సత్యాగ్రహము సాగించడానికి ఒకజట్టును నడుపుతానని ప్రకటించినందువల్ల అరెస్టుచేసినారు.

### మైసూరు రైల్వేల సమ్మె

రైల్వేకార్మికుల సమ్మెను పరిష్కారము చేసేటందుకు మైసూరు లేబరుకమిషనరు రైల్వే సమ్మెదారుల నియమంత హెచ్. డి. రాజును శనివారము కలుసుకొని సంప్రదించలేదినారు. సెప్టెంబర్ 16-వ తేది అర్ధరాత్రి మొదలు ఇంతవరకున్నూ మైసూరు రైల్వేఉద్యోగులు పదకొండువేలమంది సమ్మెలో ఉన్నారు. రైలుబండ్లను నడపడానికి ప్రయత్నాలు జరుగుతూ ఉన్నవనీ, అటువంటి విద్రోహకర కార్యాలకు సమ్మెదారులు ఎంతమాత్రము అంగీకరించరాదనీ హెచ్. డి. రాజు ఒక ప్రకటనము చేసినారు.

### శ్రీరంగపట్నము పోలీసు కాల్పులు

బెంగుళూరునుంచి మైసూరునగరానికి వెళ్లేదారిలో ఉన్న శ్రీరంగపట్నములో తాలూకా ఆఫీసుమీదికి జనసమూహాలు వెళ్లినవి. ఆ జనసమూహములోనుంచి పోలీసులమీదనూ ఆఫీసుమీదనూ రాళ్లు రువ్వినందువల్ల పోలీసులు తుపాకులు కాల్చినారు. ఇది శనివారమునాడు సాయంత్రం జరిగింది. కాల్పులవల్ల ఒకరు చనిపోయినారు.

### వంతెనల నాశనం

కోలారుకు అవతలఉన్న చింతామణి తాలూకాలో కల్‌వల్లి గ్రామప్రాంతాలలో రోడ్డుమీదఉన్న వంతెనను

2 వ పేజీ చూడుము

## కెన్యాకు బ్రిటిష్ యుద్ధసామగ్రిమార్పు

### మధ్యప్రాచ్యంలో కొత్తసైనికాశ్రయం

[ఇండియన్ యునైటెడ్ ప్రెస్]

లండన్, సెప్టెంబరు 14: భారతదేశంలోను, ఈజిప్టులోను వున్న మిలిటరీ పరికరాలన్నిటినీ కెన్యాదిశగా తీసుకుపోతున్నారు. ఈ విషయంలో దాదాపు 800మంది రాయల్ ఇంజనీర్లు ఒక పెద్ద నివేశనను నైతం తయారుచేస్తున్నట్లు తెలుస్తున్నది. మధ్యప్రాచ్య దేశాలలో బ్రిటిష్‌వారు ఇకమీద కెన్యాను మిలిటరీ ఆశ్రయంగా ఉపయోగిస్తారని తెలియవస్తున్నది. బ్రిటిష్‌వారి రక్షణశ్రేణి అక్కడ ఏర్పడుతుందన్నమాట. నైరోబీ, మొంబాసాలలో నీళ్ళ కొళాయి లైన్లను, రైలుమార్గాలను, రహదార్లను నిర్మిస్తున్నారు.

## "ప్రజలకాహార పదార్థాల సప్లయిచేసే బాధ్యతను ప్రభుత్వం కాలపరిమితి లేకుండా వహింపజాలదు"

### రాష్ట్ర శాసనసభలో రాజన్‌గారి ప్రకటన

### వచ్చేపంట సంవత్సరం నుంచీ మిగులుజిల్లాల్లోనూ, ఇతర గ్రామాల్లోనూ రేషనింగ్ రద్దుచేయాలని సూచన

డిల్లీకి నెహ్రూ రాక

న్యూఢిల్లీ, సెప్టెంబరు 14: పాకిస్థాన్ ప్రధాని లియాకత్ అలీఖాన్‌గారితో సంప్రదించి ఇండియా ప్రధాని పండిత జవహర్లాల్ నెహ్రూగారు నేటి సాయంకాలం 7-45 కు ఢిల్లీ తిరిగి వచ్చిరి.

చెన్నపురి, సెప్టెంబరు 15: "గతసంవత్సరం రేషన్ మొత్తం ఎన్నడూ 12 ఔన్సులకు తగ్గిపోలేదు. ఈ సంవత్సరం 10 ఔన్సులకు తగ్గకుండా అయినా ఉంచగలమా అన్నది సందేహాస్పదంగానే ఉంది. ప్రభుత్వ కోరికలయెడ ప్రజలకు విసుగుపుడుతున్నది. అందువల్ల ప్రభుత్వం తనబాధ్యతను కొన్ని ప్రాంతాలవరకే పరిమితంచేసుకోడం చాలేమో ననిపించుచున్నది." అని రాష్ట్ర ఆహారశాఖామంత్రి డా॥ రాజన్‌గారు నేడు ఎసెంబ్లీలో ప్రశ్నలకాలం అయిన పిమ్మట ఒకప్రకటన చేస్తూ తెలిపిరి.

కాలపరిమితి లేకుండా ప్రజలకు ఆహారధాన్యాన్ని సప్లయిచేసే పూచీని ప్రభుత్వం వహింపజాలదని తెలుపుతూ మామూలు పంపకపద్ధతులు ఎంతత్వరగా తిరిగి అమలులోకి వస్తే అంత మంచిదనిరి. గత రెండేళ్లలో ప్రభుత్వం సబ్సిడీలక్రింద 14 కోట్ల రూపాయలు వెచ్చించిందని ఈ విధంగా ఎంతకాలం అనేది లేకుండా చేసుకుపోవడం సాధ్యం గాదనీ అన్నారు. అధికాహారోత్పత్తి కార్యక్రమం తీవ్రతరం కావాలనీ వెనుకటి విధానమే పూర్తిగా మారిపోవాలనీ సూచించిరి.

రాజన్‌గారి ప్రకటనపై చర్చ జరిగెను. రెన్నేటి విశ్వనాథంగారు సర్కారువారితో ధాన్యసేకరణ గురించిన కొన్ని లెక్కలను తెలిపి ప్రభుత్వలెక్కలు సరికావని చెప్పిరి.

### రాజనుగారి ప్రకటన

ఆహారశాఖ మంత్రి నేడు శాసనసభలో ఆహార పరిస్థితుల గూర్చి తెలిపిన ప్రకటన ముందుగా శాసనసభ్యులకు పంచిపెట్టిరి. అందు 1946 మే మాసం వరకుగల పరిస్థితులను గౌ॥ శ్రీ ప్రకాశంగారు తెలిపియుండిరనియూ అటు తరువాత మన రాష్ట్రంలో ఆహార కొరత క్రమేణా ఎట్లు ఎక్కువయినదో తాను తెలిపెదనని సూచిరి.

చెన్న రాష్ట్రంలో సర్వదా బియ్యం లోటుగనే యుండెను. బర్మానుండి తదితర తూర్పు దేశాలనుండి దిగుమతి చేసుకొనుచుండెను. యుద్ధం ప్రారంభమయినాక రెండేండ్లవరకు బాగానేయుండెను. 1941 లో బర్మా పడిపోయినాక మనగానుకాక, హైదరాబాదు, మైసూరు, తిరువాన్కూరు, కొచ్చిను సంస్థానాలకు గూడ దిగుమతులు నిలచిపోయినందున, అవి మదరాసు నుండి బియ్యం కొనప్రారంభించినవి. 1942-43 లో 262000 టన్నులు మదరాసు ఎగుమతి చేసిరి. ఆ సాలాంతమున ఇండియా ప్రభుత్వంవారు కంట్రోలు అధికారం తీసుకున్నందున సంస్థానాలకు పంపవలసిన పూచీ మదరాసుకు తప్పింది. 1943-44 లో 56000 ట, 1944-45 లో 130,000 బియ్యం దిగుమతయినవి. యుద్ధానికి పూర్వం సాలీనా 451,000 ట దిగుమతి చేసుకొనేవారం. జనాభివృద్ధి ఉద్యమం వలన వ్యవసాయపు నేల విస్తీర్ణం హెచ్చినా కాలమాన పరిస్థితులు బాగులేనందున పంటలేమి హెచ్చు కాలేదు. గత మూడేండ్లలో రాష్ట్రంపంటలస్థితి యిట్లున్నది. బియ్యం - సాలీనా సగటు ఉత్పత్తి 4,856,667 ట. ఎగుమతి 76713 ట. వితనాలకుపోను భుక్తికి మిగిలినవి 4632,862 ట. మదరాసునుండి ఎగుమతయినవి. తరువాత ఇండియా ప్రభుత్వంవారు బియ్యంకంట్రోలు తీసుకొన్నందున సంస్థానాలకు సప్లయిచేసే పూచీ మనకు తప్పింది. 1943-44 లో 56,000 ట మరుసటేడాది 130,000 ట. బియ్యం దిగుమతయినవి. యుద్ధానికిపూర్వం సాలీనా

జొన్నలు - 2,652,000 ట, ఎగుమతి 22,666 ట. మిగులు 2,616,896.

గోధుమలు - 1730 ట, 60,486 ట, 62,033 మొత్తం - 7,520,897 - 6339 7,811,291. పై సంఖ్యలనుబట్టి యుద్ధకాలం ఆఖరు మూడేండ్లకు భుక్తికి మిగిలే ధాన్యం సగటులెక్క 7.70లక్షల నుండి 7.30 లక్షలకు తగ్గినట్లు తెలియగలదు. జనసంఖ్య సాలుకి 5 లక్షలు చొప్పున పెరిగింది. 1945-46 లో తుఫానువలన సర్కారు

3 వ పేజీచూడుడు

## "శాంతి ఏర్పడేవరకూ, గాంధిజీ నెహ్రూ పంజాబులోనే వుండాలి"

### పాకిస్థాన్‌మంత్రి గజ్నఫరాలీ సూచన

కరాచీ, సెప్టెంబరు 14: గాంధీజీ ఇండియా, పాకిస్థాన్ ప్రధాన మంత్రులు, ఉభయఅధివేశముల మంత్రులు కొందరు పంజాబుకు వెళ్ళి సంపూర్ణముగా శాంతినెలకొను వరకు అచ్చట నుండవలెనని పాకిస్థాన్‌మంత్రి రాజా గజ్నఫరాలీ ఖానుగారు నేడు పత్రికా ప్రతినిధులతో చెప్పిరి:

ఉభయ పంజాబుల నెదుర్కొనుచున్న అనర్థములకు అధికారులు మంత్రులు సమావేశములు జరుపుట ప్రతిక్రియ కాజాలదని ఆయనచెప్పెను.

తూర్పుపంజాబులో హతులైన వారి సంఖ్య ఒక లక్షయని, పశ్చిమ పంజాబులో హతులైన వారిసంఖ్య 10 వేలని ఆయన అంచనా వేసెను. తూర్పు పంజాబునుంచి పశ్చిమ పంజాబుకు తరలినవారి సంఖ్య 10 లక్షలని, పశ్చిమ పంజాబునుండి తూర్పు పంజాబుకు వెళ్లిన వారి సంఖ్య 3 లక్షలని ఆయనచెప్పెను. (యు. ప్రె.)

### గవర్నర్ జనరల్‌తో గాంధిజీ గోష్ఠి

#### దాదాపు ఒకగంట సమాలోచన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 14: గాంధి మహాత్ముడు నేటి మధ్యాహ్నము ఇండియా గవర్నరు జనరలు లార్డు మౌంట్‌బాటెన్‌ను ప్రభుత్వ భవనములో సందర్శించి దాదాపు ఒకగంటసేపు మాటలాడెను.

సాయంసమయమున రాష్ట్రపతి ఆచార్య కృపాలినీ గారును, శ్రీ శంకరరావు దేవ్ గారును గాంధీ మహాత్ముని సందర్శించిరి. అంతకు పూర్వము ఉపప్రధాని సర్దార్ పటేల్ మహాత్మునిచూడ వచ్చియుండెను.

## సరిహద్దు నిర్ణయసంఘం ఇచ్చిన తీర్పును మార్పించవలెనని ఇండియా ప్రభుత్వంవారి ఉద్దేశం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 14: తగిన పద్ధతులద్వారా బెంగాల్, పంజాబు సరిహద్దు నిర్ణయసంఘమువారి తీర్పును మార్పించుట ఇండియాప్రభుత్వోద్దేశ్యమని ప్రత్యేక ఇండియా గజెట్ ప్రకటనతెలుపుచున్నది. తీర్పునందలి కొన్నిభాగములు అసంతృప్తికరములని, సబబుకాని వని తాముతలచినప్పటికి కమిషను నిర్ణయములను శిరసావహింప ఉభయపక్షముల వారు ఒడంబడి యుండుటచేత ప్రస్తుతము వారు నిర్ణయించిన సరిహద్దులను తాము అంగీకరింపదలచుచున్నారని ప్రభుత్వమువారు చెప్పుచున్నారు. (అ. ప్రె.)

## పంజాబ్ శరణార్థుల రవాణా ఏర్పాట్లు

### అధినివేశద్వయ ప్రతినిధుల సమావేశ నిర్ణయం

లాహోరు, సెప్టెంబరు 14: తూర్పు పంజాబ్‌లోని ముస్లిం శరణార్థుల పశ్చిమ పంజాబ్‌కు, పశ్చిమ పంజాబ్‌లోని ముస్లిమేతర శరణార్థులను తూర్పు పంజాబ్‌కు నిర్విఘ్నంగా, క్షేమంగా చేర్చడానికి చేయవలసిన ఏర్పాట్లకు సంబంధించి నేడిచట పాకిస్థాన్, భారత అధినివేశాల ప్రతినిధుల సమావేశములో కొన్ని ప్రధాన నిర్ణయములు జరిగినవి. ఈ సమావేశములో భారత అధినివేశంతరపున పండిట్ జవహర్లాల్ నెహ్రూ, సర్దార్ బల్దేవ్‌సింగ్, జనరల్ కరియప్పగార్లు తూర్పు పంజాబు తరఫున గవర్నర్ త్రివేది, హోంశాఖా మంత్రి సర్దార్ స్వరణ్‌సింగ్ గార్లు పాల్గొన్నారు.

పాకిస్థాన్ తరఫున లియాకత్ అలీఖాన్, ఘులాంమహమ్మద్, సర్వసేనాని జనరల్ మెస్సర్వీ, పశ్చిమపంజాబు మంత్రులు సమావేశానికి హాజరైనారు.

ఈ సమావేశంలో ఉభయ ప్రభుత్వ ప్రతినిధులు మనస్ఫూర్తిగా దాపరికంలేకుండా తమ విషయాలను ఒకరికొకరు చెప్పుకున్నట్లు తెలుస్తున్నది. తమ దేశాలనెదుర్కొంటున్న సమస్యల గ్రహించి తమ బాధ్యతలను ఉభయులూ గుర్తించిరి. తక్షణసమస్యను పరిష్కరించుటకు తీసుకొనవలసిన చర్యలగురించి సమాలోచనలు జరిపినట్లు తెలియుచున్నది.

తూర్పు పంజాబునుంచి పశ్చిమ పంజాబుకూ, పశ్చిమ పంజాబ్‌నుంచి తూర్పు పంజాబుకూ చేరవలసిన కాందిశీకులను తక్షణం సురక్షితంగా చేర్చి వేయడానికి వెంటనే ఏర్పాట్లు జరగాలని ఈ సమావేశంలో తీర్మానమైనది. ఈ సమయంలో మేజర్ జనరల్ తిమ్మయ్యకూడా సమావేశంలో పాల్గొన్నారు. కరియప్ప తిమ్మయ్యగార్లు ఈ తీర్మానంగురించి సంప్రదించుకొని ఈ నిర్ణయాన్ని అమలుపరిచేందుకు ఉభయులూ అమృతసర్ వెళ్లిపోయారు. రేపటినుంచీ శరణార్థుల రవాణా ప్రారంభమౌతుంది.

ఈ సమావేశంలో చేయబడిన మరొక నిర్ణయంగురించి న్యూఢిల్లీ నుండి ఈ క్రింది అధికార ప్రకటన వెలువడింది.

లోగడ ప్రభుత్వ ఉత్తరువులు ఏవిధంగా ఉన్నా, అధికారుల ఆజ్ఞలు ఎలా ఉన్నా పశ్చిమ పంజాబునుండి తూర్పు పంజాబుకు వస్తున్న రక్షణార్థుల రైళ్లనుగాని, ఇతర బళ్లనుగాని సోదాచేయడానికి వీలులేదు. అదే విధంగా పశ్చిమ పంజాబుకు తూర్పు పంజాబునుండి పోయేవారి విషయమున్నూ. కాందిశీకులు తమ ఇష్టానుసారం తీసుకుపోవడానికి

(2-వ పేజి చూడుడు)

## గ్రీసు స్వాతంత్ర్యానికి ముప్పు వాటిల్లనున్నదని మార్షల్ హెచ్చరిక

### ఐక్యరాజ్యసమితి కర్తవ్యాన్ని వివరిస్తూ అమెరికా కార్యదర్శి ప్రసంగం

న్యూయార్కు, సెప్టెంబరు 14: "అతి క్లిష్టమైన రాజకీయ, రక్షణాల విషయములో వెంటనే చర్య తీసుకోవడం అవసరం" అని ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశమును కోరుతూ అమెరికా విదేశశాఖమంత్రి జార్జి మార్షల్ "ఐక్యరాజ్యసమితి వారము" సందర్భమున జరిగిన సభలో తన ప్రారంభోపన్యాసము చేసెను.

గ్రీసులో ప్రతిష్టంభన తొలగించుటకు అమెరికన్ ప్రతినిధివర్గం తీవ్ర కృషిచేయగలదని ఆయన చెప్పెను. అమెరికన్ ప్రతినిధివర్గమునకు ఆయనయే నాయకుడు. యుగోస్లేవియా, బల్గేరియా, ఆల్బేనియాలు గ్రీసుగెరిల్లాలకు చేస్తున్న సహాయంవలన గ్రీసు సరిహద్దులకు స్వతంత్రమునకు భంగం వాటిల్లుతున్నదనీ, అందువలన ఐక్యరాజ్యసమితి ప్రణాళిక ప్రకారం గ్రీసుకు తగిన రక్షణ కల్పించటమే తన ఆశయమని మార్షల్ చెప్పెను.

ఆయన ఉపన్యాసంలోని తదితర ముఖ్య విషయములు.

1. పాలస్తీనా: ఈసారి జరుగుచున్న సర్వసభ్య సమావేశములో అత్యధిక సంఖ్యాకుల అంగీకారంతో ఏదో ఒక పరిష్కారం జరగాలి. ఆ పరిష్కారాన్ని పాలస్తీనా ప్రజలు అంగీకరించాలి.

2. వీటో: ఐక్యరాజ్యసమితి ప్రణాళికలో పెద్ద మార్పులు చేయుటావసరం అమెరికా భావించుటంలేదు; కాని ఇప్పట్లో పెద్ద మార్పులు ఏమీ జరుగనవసరం లేదు.

3. రక్షా విధానం: "ఐక్యరాజ్య సమితిలోని అగ్రగామిక రాజ్యములే ఆ సమితిని నాశనం చేయుటకు దోహదంచేసే కార్యములకు ప్రోత్సాహం చేస్తున్నారని గాని, లేక ఆ సమితి ముఖ్యాంగముల యొక్క కార్యాచరణకు అటంకపడుతున్నారనిగాని నమ్మటానికే కష్టంగా వున్నది." అని గూఢంగా రష్యాను విమర్శించాడు, మార్షల్.

అమెరికా ఐక్యరాజ్యసమితిని బలపరచుటలోగల అంతర్యమును వివరిస్తూ మార్షల్ ఈ విషయములను చెప్పాడు:

1 ఐక్యరాజ్యసమితి ప్రణాళిక ప్రకారం మన విధులను మనం సరిగా నిర్వర్తించాలి.

2. అంతర్జాతీయ వ్యవహారములన్నియు అవి ఐక్యరాజ్యసమితిద్వారా జరిగినా, విడిగాజరిగినా, ఐక్యరాజ్యసమితి ప్రణాళికప్రకారం జరగాలి.

3 ఐక్యరాజ్యసమితిప్రణాళికప్రకారం ఆ సమితిచే పరిష్కరింపబడవలసిన విషయ

2వ పేజీ చూడుడు

## శాసనసభా సభ్యత్వము

### ఇండియా పాకిస్థాన్లు రెండిటిలో ఉండరాదు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 14: 'ఎవ్వరూ ఇండియాయందలి రాష్ట్రీయ శాసన సభలలోను, పాకిస్థాన్ నందలి కేంద్ర లేక రాష్ట్రీయ శాసన సభలలోను సభ్యులుగా నుండకూడదు' అని గవర్నర్ జనరల్ భారత స్వాతంత్ర్య చట్టం 9 సెక్షన్ననుసరించి ఉత్తరువుగావించుచున్నాడు. ఇండియా యందలి రాష్ట్రీయ శాసనసభలోను పాకిస్థాను నందలి శాసన సభలోను గూడ సభ్యుడుగా నున్న వారెవరైనను, భారత దేశమునందలి రాష్ట్రీయ శాసన సభలో సభ్యుడుగా నుండగోరెయెడల సెప్టెంబరు 15 తేదీ లోపుగా పాకిస్థాన్ శాసన సభా సభ్యత్వమునకు రాజీనామా నివ్వవలెనని ఉత్తరువు తెలుపుచున్నది. (అ. ప్రె.)

## జునాగడ్‌లో బాధ్యతాయుత ప్రభుత్వము

బొంబాయి, సెప్టెంబరు 14: "జునాగడ్ సంస్థానములో ప్రజారాజ్య స్థాపనకు ప్రజా ఉద్యమాన్ని బొంబాయి రాష్ట్ర కాంగ్రెసు కమిటీవారు బలపరిచినారు. ఈ సందర్భంలో యస్. కె. పాటిల్ అధ్యక్షతను కాంగ్రెసు కమిటీ వారు సమావేశము అయి తీర్మానము చేసినారు."

## చైనాలో కమ్యూనిస్టుపక్ష నిర్మూలనం

### ప్రభుత్వ సంకల్పం: వెడ్‌మేయర్‌కు నివేదిక

షాంఘై, సెప్టెంబరు 14: చైనా ప్రభుత్వ రక్షణకేగాక, చైనా స్వాతంత్ర్య రక్షణకు ప్రథమ సోపానముగా చైనా సాయుధ కమ్యూనిస్టు పక్ష నిర్మూలనం జరగక తప్పదని చైనాప్రభుత్వం నిర్ణయించినట్లు, ప్రెసిడెంటు ట్రూమన్ ప్రత్యేక రాయబారి జనరల్ వెడ్‌మేయర్‌కు చైనా ప్రభుత్వం సమర్పించిన ఒక నివేదికలో తెలియజేసినది.

జపాన్‌పై విజయము సాధించినప్పటి నుండి ఆర్థిక, రాజకీయ, సామాజిక రంగములలో చైనా ప్రభుత్వం సాధించిన కార్యములను తెలియజేయమని జనరల్ వెడ్‌మేయర్ కోరినాడు. అందుకొరకే ఈ నివేదిక సమర్పింపబడినది.

అన్ని రంగములలోను పునర్నిర్మాణకు కమ్యూనిస్టులు ప్రబలమైన నిరోధకులుగా నున్నారు. వారినణచివేయకపోతే దూర ప్రాచ్య శాంతిభద్రతలకే ముప్పు రాగలదని ఈ నివేదికలో వున్నది.

రాజ్యాంగము నిర్ణయించుట, రాజకీయ సంస్కరణలు ప్రవేశపెట్టుట వెంటనే జరుగనున్నట్లు సూచింపబడినది.

## గంటల పంచాంగం

సర్వజిత్ సం॥ భాద్రపదశు॥ ద్వితీయ 1947 సం॥ సెప్టెం॥ 16 మంగళవారం

మం॥ ద్వితీయ రా 8-41 హస్త రా 7-52 వర్జ్యం రా 3-41 ల 5-15 వ.

బు॥ తృతీయ సెప్టెం॥ 17 బుధవారం

బు॥ తృతీయ సా 7-27 చిత్ర సా 7-20 వర్జ్యం రా 12-58 ల 2-35 వ,



ఆంధ్రపత్రిక

సర్వజిత్ సం॥ భాద్రపదశు॥ ద్వితీయ మంగళవారము

## వాగ్దాన పాలింపు

కాంగ్రెసు తన ఎన్నికల ప్రణాళికలో ప్రజకు ఇచ్చిన వాగ్దానమును పురస్కరించుకొని, జమీందారీ విధానమును రద్దుచేయుటకు శాసనముచేయ మద్రాసు మంత్రివర్గము మొన్న ఒకబిల్లును ప్రకటించినది. జమీందారీలు రద్దు అగుటతోపాటు, ఆ ప్రాంతము లందలి శిస్తులు రైత్వారీ ప్రాంతములతో సమానముగ తగ్గించుటకుకూడ మరొక బిల్లు తయారు చేయబడినది. ఈ రెండుబిల్లులు శాసనములగుటతో రైతుకు, ప్రభుత్వమునకు నడుమనుండు మధ్యస్థులు అంతరించుటేగాక, భూమిశిస్తు విధానమంతయు ఆయాపరిసరములందున్న రైత్వారీ ప్రమాణముతో సరిగనుండగలదు. పరిసర రైత్వారీ ప్రాంతమున నున్న శిస్తుకన్న ఒక జమీందారీలో శిస్తు తక్కువయున్న అక్కడ అ తక్కువశిస్తే అమలునం దుండగలదు. చిరకాలముగ తీవ్రముగ ప్రజాకాంక్షితమైన, కాంగ్రెసు తన ఎన్నికల ప్రణాళికయందు వాగ్దానముచేసిన యీ సంస్కరణను మంత్రిపదవి అంగీకరించిన ఆరుమాసములలో సాధించినందుకు రెవిన్యూమంత్రి శ్రీ కళా వెంకటరావుగారు ఎంతయు అభినందనీయులు. ఆయన దీక్షకు, కార్యసాధనాశక్తికి, సంస్కరణ శాశ్వతనిదర్శనముగానుండగలదు.

జమీందారీలు రద్దయినందుకు ఎవ్వరో కాక చివరికి జమీందారులుకూడ చింతపడ జాలరు. ఆ విధానము కాలమునకు విరుద్ధమగుటే కారణము.

మధ్యేమార్గము వొంకతిరుగుళ్లులేకుండ, సూటిమార్గమున తక్షణము ఒక దెబ్బన జమీందారీలను రద్దుచేయ చూచుట శ్రీ వెంకటరావుగారి బిల్లుయొక్క ప్రధానలక్షణము. పర్మెనెంటు సెటిల్ మెంటును రద్దుచేసి జమీందారులకున్న సర్వ హక్కులు ప్రభుత్వమునకు సంక్రమింపచేయుచున్నది. అంతేకాని, ప్రప్రథమమున ఆయాకాలము లనాటికి, శిస్తును తగ్గించి, దానిని కొలిచి, కొనుటకు తారాడుచూ, అది తెలిసినపిమ్మట దానిని అమలు జరుగువరకు, ఆ తరువాత రద్దు అగువరకూ జమీందారులు ఊగులాడుచూ ఉండవలసిన అనవాజస్థితిని కలుగచేయుట లేదు. వ్యాజ్యకారణములను సాధ్యమైనంతవరకు తగ్గించుచున్నదే కాని వాటికి ఎక్కువ అవకాశములను కల్పించుటలేదు. జమీందారులకు వచ్చిన పరిహార పంపక విషయమున తప్ప, ఏ ట్రిబ్యూనల్ నిర్ణయముమీద అప్పీలు లేదు. వ్యాజ్యసంబంధమైన ఇబ్బందులు జమీందారుకే యున్నవి కాని, రైతుకు లేవు. ప్రైవేటు భూములని తెలిపిన, ఆ అంశమును నిరూపించుచూ ట్రిబ్యూనల్ కు నచ్చునట్లుగ జమీందారే ఆభూముల చరిత్రను నివేదించవలసియున్నది. ఇంచుమించు అన్ని విషయములందు, ఆయా ట్రిబ్యూనల్ దే అంత్య నిర్ణయాధికారము అగుటవల్ల, అవి నిర్వహించవలసిన కార్యభారమునుబట్టి బహు నిష్పాక్షిక భావముతోను, విశాలదృష్టితోను వ్యవహరించవలసియున్నది. అందుకు నియమింపబడువారు పేరు ప్రఖ్యాతులు గలవారై యుండవలెను. బిల్లు శాసనమైనపిమ్మట, దానిని అమలుపరచుటకు నియమింపబడు అధికారి (కమీషనర్) ప్రభుత్వము అజమాయిషీ క్రింద నుండుట కొంతతృప్తికరమైన విషయము. సర్వే సెటిల్ మెంటులకు అతను నియమించు సిబ్బంది అతి జాగ్రత్తగ వ్యవహరించిన తప్ప అనేక ప్రమాదములు రాగలవు. ఈ శాఖ సివిల్ సప్లయిశాఖ అంత ప్రాధాన్యముగ పరిణమించవచ్చును. గృహములకు సంబంధించిన 19 వ సెక్షనులోని నిబంధనలు లోపభూయిష్టమని చెప్పక తప్పదు. అనేక జమీందారులు, తన నివాసగృహములందే కాణాలను ఏర్పరచుకొని యుందురు. వాటిని ప్రత్యేకముగా, కార్యాలయముల క్రింద వినియోగించిన ప్రభుత్వమునకు వశమగుననుట కేవలము అన్యాయము. ప్రభుత్వము జరుపవలసిన తతంగము కొద్దికాలములో ముగియనున్నపుడు వారికి గృహములు ఎందుకు? రైతు ఋణవిమోచన చట్టము, ముందు అప్పు చెల్లించిన వానికి ఏమీ ప్రయోజనము సిద్ధింపచేయనట్లుగ ఈ బిల్లు నిబంధనలు కొన్నియున్నవి. ముఖ్యముగ పేష్కషుకు సంబంధించినది దానికి తార్కాణము.

అన్యాక్రాంతమునకు సంబంధించినబిల్లు నిబంధనలు, 1946 ఆగస్టు రైతు హక్కురక్షణకు, 1947 జూన్ ఆర్డినెన్సును మించియున్నది. కొన్ని కృత్రిమమైన, చట్టవిరుద్ధమైన లావాదేవీలు జరిగియుండవచ్చును. కాని, అనేకము మంచి ఉద్దేశముతోను నిర్దుష్టముగ జరిగియుండవచ్చును. కాబట్టి వాటికి ఈ బిల్లు ననుసరించి ప్రమాదము రాకుండ చూడవలసియున్నది.

జమీందారీలను రద్దుచేయు బిల్లును గురించి వచ్చువిమర్శలలో ప్రధానమైనదీ, అతి తీవ్రమైనదీ జమీందారుల కిచ్చు పరిహారమునకు సంబంధించినది. ఇవ్వదలచినది ఎక్కువని కొందరి యభిప్రాయము. అసలుఎట్టి పరిహారము కూడదనువారుకూడ లేకపోలేదు. అయితే వారుకూడ ఏదో నామమాత్రముగ ఇచ్చుటకు అంగీకరించిరి. కాబట్టి ఎంత ఇవ్వవలెనను దానిమీదనే అభిప్రాయభేదము. జమీందారీ అనునది కేవలము ఒక సర్వీసు అను సిద్ధాంతము, తక్కువ పరిహార మివ్వవలెనను వాదివాదమునకు ఆధారము. దీనికి అనుకూలముగను, ప్రతికూలముగను సరిసమాన వ్యాఖ్యానము లున్నవి. కాని ఆచరణలో మాత్రము ఇన్ని సంవత్సరములుగ ఆస్తిగనే పరిగణింపబడుచున్నవి. వాటినికొనుట, అమ్ముట, వాటి మీద అప్పులిచ్చుట జరుగుచున్నది. ఈ మధ్యకాలమునందుకూడ కొందరు జమీందారీలను కొనిరి. పర్మనెంట్ సెటిల్మెంటు నాటికేటు పరిహారమునకు ఆధారముగ చూచుకొనవలెనని, అప్పటి వస్తురూపముగ నున్నదానికి ఇప్పటిధనరూపముగ విలువ కట్టవలసియున్నది. అదీగాక ఇప్పుడు ప్రభుత్వము తీసికొనిన ఆస్తులను గాని, భూములను గాని ఇప్పటి మార్కెట్టు రేటును బట్టి స్థితిని గమనించి కట్టుచున్నారు గాని వెనుకటి రేటును కట్టుట లేదు కదా! అన్ని వస్తువుల ధరను, చివరికి ఆహార వస్తువుల ధరను నియమించుటలో ప్రస్తుతపరిస్థితులు గమనింప బడుచున్నవి. జమీందారీలు ఇంతకాలము సంఘమునకు ప్రమాదకరముగ నున్నవి, అందువల్ల దానికి ప్రతీకారముగ, పరిహారము అనునది కూడదనిన అదివేరు. కాని పరిహారము ఇవ్వవచ్చునన్న సిద్ధాంతము అంగీకరింప బడినప్పుడు, న్యాయమైన పరిహారము ఇచ్చుట అవసరము. కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికకూడ 'న్యాయమైన పరిహారము ఇవ్వవలె'నని నది. జమీందారి ప్రైవేటు భూములను కూడ ఇదే దృష్టితో చూడవలసియున్నది. జమీందారుగాయున్నపుడు, అతనిప్రైవేటు భూములకు పరిమితులను కలుగజేయవచ్చును. కాని జమీందారీ రద్దుఅగుటతో కూడ ఇతర రైతులకున్న హక్కులు వానికి ఉండకూడదనుట సమన్వయదృష్టిని ప్రదర్శించుట లేదు. మొత్తమందరికీ స్వంత సాగు భూములను పరిమితము చేయునపుడు, అది వానికి వర్తింపు కాగలదు. జమీందారులు కేవలము ఒక ప్రత్యేకపరిస్థితుల మూలమున సృష్టింపబడిరి. ఇపుడా విధానము ఆధునిక పరిస్థితులనుబట్టి అంతరింపవలసియున్నది. దానికి జమీందారులుకూడ ఇతరులంత సుముఖులే అని అనవచ్చును.

జమీందారీ విధానము రద్దుతో భూమిశిస్తు విధానమునకు సంబంధించిన సమస్యలన్నీ పరిష్కరింపబడిన వనుకొనుట కేవలము భ్రమ. గొప్పసంస్కరణగా కనుపడినప్పటికీ, జరుగవలసిన దానితో పోల్చిన అతి చిన్నవిషయ మనవలసియున్నది. జమీందారీ రద్దువలన గాని, రైత్వారీ శిస్తు అమలుజరపినగాని రైతుకు కొంతశిస్తు భారము తగ్గుటతప్ప అసలు వ్యవసాయమునకు సంబంధించిన సమస్యలు యథాప్రకారము నిలిచియుండగలవు. 1802 సం॥ నాటి శిస్తురేటు అమలుపరచిననూ పరిష్కారము పొందవు. దానివల్లకూడ శిస్తు మరికొంత తగ్గునే గాని, పెద్ద రైత్వారీ భూస్వామి సమస్య, కౌలు, నిర్ణయము భూపరిమితి, ఆదాయమును బట్టి శిస్తును హెచ్చించుట, వ్యవసాయము చేయని భూస్వామి సమస్య మొదలైనవి పరిష్కరింపబడుటకు సమగ్ర శాసనము జరుగుట అవసరము. వెనుక రెవిన్యూమంత్రిగారు వీటన్నిటిని గురించి ప్రసక్తి చేసియుండిరి. అచిరకాలములోనే వాటి పరిష్కారమును గూర్చిన శాసనము చేయుదురని ఆశించుచున్నాము.

## కామరాజ నాడార్ పై అవిశ్వాస తీర్మానం

ఓడపడవల్లి, సెప్టెంబరు 13: తమిళనాడు రాష్ట్రీయ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులగు శ్రీ కామరాజ నాడార్ గారిపై తమకు విశ్వాసము లేదను తీర్మానము కొనకనాడు తమిళనాడు కాంగ్రెస్ వర్కర్ల సమావేశము వారు నేటి మధ్యాహ్నము ఏకగ్రీవముగా ఆమోదించిరి.

## ఢిల్లీ పరిసరంలో దుండగుల దౌర్జన్యాలు

### రాజధాని పరిస్థితి దాదాపు అదుపులో ఉంది

### సంక్షుభిత ప్రాంతాల్లో సర్దార్ పటేల్ సంచారం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 14: ఈ రోజు రాత్రి ఏడు గంటలన్నర లోపల ఢిల్లీనగరములో అక్కడక్కడ దోపిడులు జరిగినట్లున్నూ, కొన్ని భాగాలలో ఇండ్లు అంటుకొన్నట్లుగానూ తెలియవచ్చింది. దర్యాగంజ్ అనే బజారులో పోలీసులున్నూ మిలిటరీవారున్నూ దుండగులమీద తుపాకులు ప్రేల్చవలసి వచ్చింది.

గతరాత్రియున్నూ శనివారంనాడు ఉదయమున్నూ అక్కడక్కడబాకులతో పొడిచి చేయడమున్నూ దోపిడులున్నూ సాగినవి. ఉదయమునుంచి పరిస్థితులు చక్కబడేట్లుగా కనపించింది. కిషన్ గంజ్ రైల్వే స్టేషనుదగ్గరఉన్న పెట్రోలుస్టోరుకు కాపలా ఉన్న పోలీసులమీద దుండగులు తుపాకులు కాల్చినారు. వెంటనే అక్కడ ఉన్న మిలటరీ ఆదుండగులమీద తుపాకులు కాల్చినారు. ఆరుగురు చచ్చిపోయినారు. ఇద్దరు గాయపడ్డారు. ఆ ప్రాంతాన్ని అంతా మిలటరీవారు శోధించి కొన్ని తుపాకులను స్వాధీనము చేసుకొన్నారు. రైల్వేస్టేషన్ దగ్గర అప్పుడప్పుడు తుపాకుల ప్రేలుడు శబ్దము వినిపించింది. కాని మిలటరీవారికిగాని దుండగులకుగాని ప్రమాదము ఏమీ కాలేదు.

సాదర్ బజారులో కర్ఫ్యూను ధిక్కరించినందుకు ఒకరిమీద తుపాకి పేల్చినారు. అతగాడు అక్కడికక్కడే చచ్చిపోయినాడు.

నగరపరిస్థితులను పరిశీలించడానికి విమానములో చూడగా ఢిల్లీ శివారు గ్రామము అయిన మెహరౌలీకి పెద్ద పెద్ద జనసమూహాలు తరలిపోతూ ఉన్నట్టున్నూ, ఆగ్రామములో ఒకభాగము తగుల బడిపోతూ ఉన్నట్టుగానూ కనుపించింది. అక్కడ దుండగులు మిలటరీమీద తుపాకులు కాల్చినారు. మిలటరీవారున్నూ తుపాకులుకాల్చి ఆప్రాంతాన్ని అదుపులోకి తీసుకొనివచ్చినారు.

రెండురోజులక్రిందట భోర్ గ్రామములో ఒకానొక శిబిరమును దుండగులు చుట్టుముట్టినారు. ఇప్పుడు ఆ ప్రదేశము అదుపులో ఉంది.

ఢిల్లీజిల్లా సుర్గాం, బల్లభ్, బాలాబ్ ఘర్, ప్రాంతాలలో ఫిమోశ్య పరిస్థితి ఏమీ లేకలేదు. ఆపాటి రైల్వే స్టేషన్లో ఒక గూడ్సుబండిని దోచివేయడానికి దుండగుల మూకలు బయలుదేరిరాగా ఆ మూకలను చెదరగొట్టడానికి మిలటరీవారు తుపాకులు కాల్చినారు. చాలమందికి ప్రమాదము అయింది. ఇరవై మంది చనిపోయినారు.

ఫతేపూర్ ప్రాంతములో తూర్పు పంజాబు కాపరు కాందిశీకుల సమూహమును కొన్ని జట్లువల్లి చుట్టుముట్టి ముప్ఫయి మంది కాందిశీకులను చంపివేసినారు. ఎనిమిదిమందిని గాయపరచినారు. ఆ కాందిశీకుల సమూహములో వెళ్లుతున్న పూరుషులందరినీ ఎద్దులబండ్లమీద పశువులను దోచుకొని ఆబండ్లకు తగులబెట్టినారు.

### "డాన్" ప్రెస్ ను దగ్ధంచేసే ప్రయత్నం

ఈ రోజు మధ్యాహ్నము ఫయిజ్ బాగ్ లో కొత్తగా పెట్టిన "డాన్" ముద్రాక్షరశాలకు నిప్పు ముట్టించినట్టున్నూ ఫైర్ బ్రిగేడ్ సాయము కావలెనని వర్తమానము వచ్చింది. ఫైర్ బ్రిగేడ్ వారు మంటలను ఆర్పడానికి అక్కడికి వెళ్లగా చుట్టు ప్రక్క ఇండ్లనుంచి ఫైర్ బ్రిగేడ్ వారిమీద రాళ్లు కొట్టడము ఆరంభించినారు. వెంటనే పోలీసువారున్నూ మిలటరీవారున్నూ ప్రవేశము కలగచేసుకొని పరిస్థితులను అదుపులోకి తీసుకొని రాగలిగినారు.

టర్క్ మన్ గేటుదగ్గర అప్పుడప్పుడు కాల్పులు జరిగినట్లు తెలిసినందువల్ల అక్కడ మిలటరీని ఉంచినారు. కూచపాహూ అనే ప్రదేశములో ఇద్దరిని దుండగులు బాధించకుండా పోలీసువారు తప్పించినారు. మరొక ప్రదేశములో ఒక బంగాళాలో ముస్లిం దుండగులను అరెస్టుచేసి ఆ బంగాళా సోదాచూచి లైసెన్సు పొందని తుపాకులనుకొన్నిటిని పట్టుకొన్నారు.

### సర్దార్ పటేల్ సంచారము

హోంశాఖా మంత్రి సర్దార్ వల్లభ భాయి పటేలు ఈ రోజు సాయంత్రము ఫరాష్ బజారు అంతా తిరిగి చూచినారు. టర్క్ మన్ గేటులో ఉన్న కంట్రోలుగదికి వచ్చినారు. ఫయిజ్ బజారు విషయాలను విచారించి తెలుసుకొన్నారు. ఢిల్లీ ఎమర్జెన్సీ కమిటీ ఉపాధ్యక్షుణ్ణి పోలీసు కమీషనరు పంజాబ్ మిల్లను యిం కా ఇతరుల అధికారులను కలుసుకొని పరిస్థితులను గురించి చర్చించినారు.

## ఈ ఉన్మత్తచర్యలు అంతం కావాలి

### గాంధీజీ హెచ్చరిక

### శరణాలయాల అనుచి : మహాత్ముని విమర్శ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 14: గాంధీజీ నేడు ప్రార్థనానంతరం అనేక విషయములు ప్రస్తావించెను. తాను ఢిల్లీలో శాంతి సాధించడానికి లేదా ఆ ప్రయత్నంలో మరణించడానికి వచ్చానని ముందు చెప్పారు. మతోన్మత్తులు చేయుచున్న ఈ చిత్రవధలు, జాతీయ ఆత్మనిగ్రహం సాచర్యలను, ప్రభుత్వానికిచేసే ద్రోహాన్ని చూచాలనే అభిలాష తనకు లేదని చెప్పారు.

శనివారంనాడు రెండు ముస్లిం కాందిశీక శరణాలయాలకు వెళ్లివచ్చితినని చెప్పి అక్కడ ఒక్క ముస్లిం అయినా తనపై క్రోధంగా గాని, ఆగ్రహంగా గాని చూడలేదని వెల్లడించారు. వారందరూ నిరుత్సాహంగా అవుపించినారనీ, అందులో కేవలం ఎముకలు, చర్మం తప్ప మరేమీ లేనట్టి ఒక సమోన్నసుడున్నాడనీ చెప్పి ఈ క్రింది వివరాలను ప్రకటించారు. "అతని శరీరంలోని ప్రతి ఎముకా స్పష్టంగా కన్పిస్తున్నది. అతని శరీరంపైన అనేకచోట్ల కత్తిపోట్లు కన్పించినవి. అదేవిధంగా గాయపడిన ఒక స్త్రీ అతనిపక్క ఉంది ఆమె అంత ముసలిదికాకపోయినా చాలా కుష్కించిపోయింది. శిబిరమంతా చీనుగులతో ఈగలవాలుతోకలసి వచ్చింది. వారేమతస్థులైనా, స్త్రీలు, పురుషులు అందరూ వారు ఒక్కరే.

ఢిల్లీ శరణాలయాలలోని అపారి సంఖ్యం భరింపరానిదిగ నున్నది. ఇప్పుడాది పిలువగానంత అపరిశుభ్రంగా ఉన్నది. ప్రక్కనున్న డ్రైనేజీ ఎండిపోయింది. మంచినీళ్లు ఎక్కడనుంచి తెప్పుకుంటారని నేను కాందిశీకులను అడగలేదు. అక్కడున్నవారు ఏదోవిధంగా కాలక్షేపాలు తీస్తుంటున్నారు. నేనే ఆ రక్షణాలయాధిపతిగా ఉంటే, సైన్యం పోలీసులు నా క్రింద ఉంటే వెంటనే పలుగు పారపట్టుకొని ఆ ప్రాంతాన్ని పరిశుభ్రం చేయడానికి పూనుకుంటాను. సైనికుల్నీ, పోలీసుల్నీ నాతోపాటు ఆపని చేయమంటాను. కాందిశీకులనుకూడా ఆ విధంగా వచ్చి సహాయంచేయవలసిందిగా కోరుతాను.

"ఆ ప్రాంతం ఏమాత్రం వాసయోగ్యంగాలేదు. చెంటకష్టగా ఉంది ఆప్రదేశం. వాన్ని సభ్రంచేసే తప్ప అక్కడ ఉండమని ఎవ్వరికీ చెప్పరాదు. ఆ ప్రాంతాన్ని శుభ్రపరచడానికి డబ్బు ఏమీ అవసరంలేదు. కొంచెం ముందు ఆలోచనే కావాలి. సదిగా ఉండాలనే జ్ఞానంకూడా ఉండాలి.

"హిందువులంటున్న ప్రాంతాలు ఇంతకంటే మెరుగ్గాలేవు. అసుచి జాతీయదుర్గుణంగానే ఉంటున్నది. దీన్ని ఎంత త్వరగా రద్దుచేసివేస్తే అంత మంచిది.

"ఈ శరణాలయాలు చూచినతరువాత నా దినాలు జనాభా మార్పిడి జరిగిపోయినవి. పశ్చిమ పాకిస్తాన్ రాష్ట్రాలనుండి ఇంతమంది హిందువులు, సిక్కులు ఎందుకు వచ్చివేస్తున్నారా అని ఆశ్చర్యం వేస్తున్నది. హిందువుగాగాని, సిక్కుగాగాని ఉండటం అపరాధమా? భయభ్రాంతులై పారిపోయి వస్తున్నారా? లేక తూర్పున తమ వారు చేసిన పనికిశిక్షా?

"ఢిల్లీలోని ముస్లింలు తమ ఇళ్లు వాకిళ్లు వదలి పారిపోవలసినంతగా ఎందుకు భయపడవలసి వచ్చింది? ప్రభుత్వాలు పనిచేయడంలేదా? ప్రజలు తమ ప్రభుత్వాల పనిచేయడం అలక్ష్యంచేస్తున్నారు?

"కొందరు ముస్లింలకడ్డ తెల్లని చెన్ననే ఉండా ఆయుధాలున్నవి. అనిధంగా ఉన్న ఆయుధాలను స్వాధీనం చేసుకోవడం గురించి ప్రభుత్వం చర్యతీసుకుంటుంది. వారిపని చెల్లకపోతే తప్పకొని అంతకంటే సమస్తలేనవారికి అధికారం వప్పగింతపెట్టాలి. ప్రభుత్వం వీలాసిన్మెష్ అలాగే ఉంటుంది. శాసనాన్ని తమకై తామే ప్రజలు అమలు చేయడం ప్రజాస్వామ్యపద్ధతికి వ్యతిరేకం, విరుద్ధం. ఈ అరాచకం పాకిస్తాన్ లో ఉన్నా ఇండియన్ యూనియనులో ఉన్నా భారతదేశానికి కీడే మాత్రం మంచిగాదు."

## ఢిల్లీజిల్లా మేజిస్ట్రేటు ప్రకటన

ఎవరున్నూ ఇండ్లకప్పులమీదికి ఎక్కరాదనీ, ఆజ్ఞ ఎవరయినా ఇండ్లకప్పులమీదకు ఎక్కటమంటే కనిపించిన పోలీసువారుకాని మిలటరీవారుకాని వారిని తుపాకులతో కాల్చివేస్తారనిన్నీ జిల్లామేజిస్ట్రేటు ఒక ప్రకటనను చేసినారు. ఈ ఉత్తరువు వెంటనే అమలులోకి వస్తుందనిన్నీ ప్రకటించినారు.

## రవాణా ఏర్పాట్లు

[1 వ పేజీ తరువాయి]

పోయున్నంతవరకు వారు తమని తీసుకుపోవచ్చును. రైలు నిన్న, ఉన్నట్టి ఆయుధాలను కూడా తీసుకొని పోవచ్చును. ఈ నిర్ణయాలను పశ్చిమ పంజాబు ప్రభుత్వమున్నూ పాటిస్తుంది. అధికారు లందరికి లిఖితపూర్వకంగా ఈ ఉత్తరువులు అందక పోయినప్పటికినీ, వీటిని ప్రభుత్వ ఉత్తరువులుగానే భావించి పాలించవలెనని కూడా హెచ్చరిక చేయబడెను.

## పాకిస్తాన్ ప్రతినిధుల సమావేశం

పశ్చిమ పంజాబు, పరిహద్దు రాష్ట్రముల గవర్నర్లు, ప్రధానమంత్రులు, పాకిస్తాన్ ప్రభుత్వ ఆర్థిక శాఖామంత్రి, సర్వసేనాని ఈరోజు పాకిస్తాన్ ప్రధాని లియాఖత్ అలీఖాన్ అధ్యక్షతను సమావేశమై పశ్చిమ పాకిస్తానుకు సంబంధించిన వివిధ సమస్యల పరిశీలించి కొన్ని ప్రధానమైన నిర్ణయములను చేసినట్లు తెలియుచున్నది.

## మార్షల్ హెచ్చరిక

(1-వ పేజీ తరువాయి)

మూలన్నిటినీ, విడిగా కాంతియుతంగా పరిష్కరింపబడని సమస్య లన్నింటినీ, ఐక్యరాజ్యసమితి పరిష్కారమునకు వదిలి వేయాలి.

4. ఐక్యరాజ్యసమితి తరఫు శాఖలలో మనం భక్తివిశ్వాసములతోను, పట్టుదలతోను పనిచేసి అవి తన కార్యమును సక్రమముగా నెరవేర్చునట్లు చూడాలి.

5. ఐక్యరాజ్యసమితి నిబంధనావళిని గౌరవించి, ఆ సమితి కార్యకలాపము త్వరితముగా, సక్రమముగా జరుగునట్లు ఇతరులతో మనం పనిచేయాలి.

6. ఏ పర్వరాజ్య స్వాతంత్ర్యముతైనా భంగంవాటిల్లినచో, ఇతర పర్వరాజ్యము లన్నియు కలిసి గట్టిచర్య తీసికొనగలవని నిరూపించాలి.

7. ఇప్పటికింకా మిగిలివున్న కాంతి సమస్యలన్నీ జరిగి, ప్రశాంత వాతావరణం ఏర్పడేటట్లు చేయాలి.

8 ప్రపంచఆర్థికపరిస్థితి అభివృద్ధి చెంది, ప్రపంచంలో ఆర్థికసుస్థిరత ఏర్పడుటకు ఇతరులకు సహాయంచేయాలి.

ఇప్పటికింకా ఐక్యరాజ్యసమితిలో చేర్చుకొనబడకుండా వున్న రాజ్యములు, అవి అందుకు తగినవైనచో, త్వరలో చేర్చుకొనుటకు తగుచర్య తీసుకొనవలెను.

## మైసూర్ లో కాల్పులు

(1-వ పేజీ తరువాయి)

ఎవరో పడగొట్టినారు. రైలుకంపెనీ వద్ద కొట్టడానికి సైన్యము పెట్టినారు.

### నిజలింగప్ప అరెస్టు

కర్ణాటకరాష్ట్రీయకాంగ్రెసు కమిటీ అధ్యక్షుడున్నూ మైసూరు సత్యాగ్రహ ఉద్యమ నాయకుడు నగు నిజలింగప్పను మైసూరునగరములో ఈరోజున (14 వ తేదీన) అరెస్టుచేసినారు. ఈయన భారత జాతీయ రాజ్యాంగపరిషత్తులో సభ్యుడు. మైసూరు రాజనగరు ఎదుట సత్యాగ్రహము సాగించుటకై మైసూరువచ్చినాడు కనుక అరెస్టుచేసినారు.

### బొంబైకర్ణాటకుల విజ్ఞాపనం

బొంబాయినగరములో నూటుంగా అనే ప్రాంతములో నివసిస్తూ ఉన్న మైసూరుసంస్థానము వారైన కర్ణాటకులందరున్నూ ఒక సభచేసి మైసూరు ప్రభుత్వమువారు రాజకీయ ఖయిదీలను అందరినీ వెంటనే విడుదల చేయవలెననీ బాధ్యతాయుత ప్రభుత్వము మైసూరులో నెలకొల్పవలెను అని తీర్మానించినారు.

### సత్యాగ్రహ కమిటి సమావేశము

హుబ్బలి, సెప్టెంబరు 15: మైసూరు సంస్థానములో ఇకముందు సాగించవలసిన ఉద్యమాన్ని గురించి యోజించే టందుకు సెప్టెంబరు 17 వ తేదీన హుబ్బళిలో సమావేశము జరుగుతుందనిన్నీ ఇంతవరకూ అరెస్టుకాకుండా ఉన్న మైసూరు కాంగ్రెసు ప్రచారకులున్నూ రహస్యముగా దాగుకొని ఉన్న కాంగ్రెసువారున్నూ ఈ సమావేశానికి హాజరు కావలసిందని మైసూరు కాంగ్రెసు సత్యాగ్రహ కమిటి కార్యదర్శి ఆర్. యస్. ఆరాధ్య ఈరోజున ఒక ప్రకటనను చేసినారు.

## జోలార్పేటవద్ద గూడ్సు బండికి ప్రమాదం

### పట్టాలు తొలగి పడిపోయినది

మద్రాసు, సెప్టెంబరు 17: జోలార్పేట నుంచి చెన్నపట్నం వస్తున్న ఒకగూడ్సు రైలు నిన్న జోలార్పేటకు ఇన్నెమైళ్ల దూరము వచ్చిన తర్వాత పట్టాలు తప్పి నది కొంతం చేర మూడు పెట్టెలు పడిపోయినవి. ఈ పెట్టెలలో వున్న కూలీలు, మరికొందరు సమాహ్వానాలు తెలియవంతేదు.

## "ప్రతీకారానికి దిగడం అవివేకం"

### ఆఫ్రిడీలకు జిన్నాగారి సలహా

కరాచీ, సెప్టెంబరు 14: ఖైబర్ ఏజన్సీ ఆఫ్రిడీలపక్షమున నవాబ్ జాదా ఖాలిక్ ఖాన్ మాలిక్ పంపిన తంతివార్తకు జిన్నాగారు సమాధానమొసంగుచు పాకిస్తాను ముసల్మానులు పాకిస్తాన్ వెలుపలివున్న బారిటీగానున్న మహమ్మదీయులు ప్రతీకారమునకు గడంగుటయు, కసితీర్చుకొను చర్యలకు గడంగుటకు చాలాఅవివేకమని చెప్పుచున్నారు. ఇట్టి చర్య ఇస్లామ్ మతసిద్ధాంతములకు విరుద్ధముగాత్రమేగాక హిందూస్థానములోను, ఈ ఉపఖండము నందలి యితరప్రదేశములోను మైనారిటీగా నున్న మహమ్మదీయులకు సహాయకారి కాజాలదనుచున్నారు.

నవాబ్ జాదా ఈ క్రింది విధముగా తంతినంపియుండెను: "తూర్పు పంజాబు ముస్లిముల యెడల చూపుచున్న క్రూరత్వమును మేము సహింపజాలము. దీనికి అసిపేయుని యెడల ప్రతిచోట మేము కసి తీర్చుకొనెదము. మీ సలహా తంతి పూర్వకముగా తెలుపుడు."

ఈ సమాధానమునకు అనుబంధంగా ఖాయిదే ఆజామ్ జిన్నా ఒక ప్రకటన గావించుచు పరిహద్దు కొండజాతులనుండి యిట్టి తంతివార్తలనేకము తనకు వచ్చెనని చెప్పుచు అందరికీ తానొసంగు సలహా ఇదియేననుచున్నారు. ప్రతిచోట మహమ్మదీయుల రక్షణకై పాకిస్తాను ప్రభుత్వము చేతైనదంతా చేయుచున్నదని చెప్పుచు మహమ్మదీయులు, వ్యక్తులుగాని, వర్గములుగాని త్వరపడి చర్యకై కొనవలదని కోరుచున్నారు. (ఇ. ప్రె.)

## పర్షియా పరిస్థితి

### అమెరికా జోక్యం ఉన్నదని లండన్ వర్గాల విమర్శ

[ఇండియన్, యునైటెడ్ ప్రెస్]

లండన్, సెప్టెంబరు 11: పెట్రోల్ గనుల సమస్యమీద ఈ తరఫ్ పర్షియాలో ప్రస్తుతం విషమపరిస్థితి ఏర్పడినది. దీనికి తెరవెనుక తతంగమేదో జరుగుతున్నదని లండన్ లో అభ్యుదయ దృక్పథంగల రాజకీయవేత్తలు అభిప్రాయ పడుతున్నారు. అమెరికా టెహరాన్ లో తన రాయబారి అయిన జార్జిఅలెన్, పర్షియా ప్రధానిఘవం సుల్తాన్ పై ఒత్తిడి తీసుకోవడమే తతంగమంటున్నారు. రష్యా, పర్షియా పెట్రోల్ ఒడంబడికను శాసనసభలో ప్రవేశపెట్టడానికి ముందుగానే దానిలో తగిన సవరణ చేయుస్తానని ప్రధాని సుల్తాన్ మాట ఇవ్వడం ఈ ఒత్తిడివల్లనే జరిగిందని ఎంచుతున్నది. సుమారుగా ఈ సంక్షోభము పర్షియా ఆమోదించి: అతరభాగము రష్యా ప్రభుత్వం పట్టుదల చూపడం "పర్షియాపై రష్యా ఇంచుమించు యుద్ధం ప్రకటించడమే" అనికూడా అమెరికా వర్గాలవారు వ్యాఖ్యానిస్తున్నారు.

పర్షియా స్వాతంత్ర్య రక్షణకు అమెరికా సహాయపడుతుందని జార్జి అలెన్ మాట ఇవ్వడం పర్షియన్ నాయకులపై అమెరికా ఆధిపత్యం ఉంటదనే నట పర్షియన్ పోలీసు దళాలపై అమెరికన్ అధిపత్యం ఇదివరకే వున్నదనీ, అమెరికా ఆయుధాలతో రక్షణస్థావరాలను, విమానాశ్రయాలను కూడా పర్షియాలో నిర్మిస్తున్నారనీ తెలుస్తున్నది.

## న్యూయార్కులో డచ్చి గవర్నర్ జనరల్

హేగ్, సెప్టెంబరు 14: ఇండొనేసియాలో డచ్చిగవర్నర్ జనరల్ డాక్టరు వాన్ మూక్ న్యూయార్కు నుండి బొలెంటుకు తిన ప్రయాణం చాయలోకి చేరాడు. ఈ పర్యాయం ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశంలో ఇండొనేసియా గురించి చర్చలు జరుగును. గాబట్టి, ఐక్యరాజ్యసమితి సభ్యులను సందర్శించి, పరిస్థితులు తెలియజేయుటకు ఆయన న్యూయార్కులోనే యింకా కొద్దికాలం వుండగలరు. ఇండొనేసియా విషయమై విచారణ చేయుటకు ఐక్యరాజ్యసమితిచే నియమింపబడిన సంఘములో ఆస్ట్రేలియా కూడా ఒక సభ్యరాజ్యము గాబట్టి ఆస్ట్రేలియా విదేశాంగమంత్రి డా॥ ఎవాట్ ను డా॥ వాన్ మూక్ సందర్శించనున్నాడు.

యుద్ధవిరమణపు ఉత్తర్వులు ఏ విధంగా పాటింపబడుచున్న పరిశీలించుచున్న విదేశ దౌత్యోద్యోగుల కన్సల్ లు పనిలో నిమగ్నులై వున్నారు. అమెరికా కన్సల్ లు యిద్దరు ఈ రోజు జోక్ జకర్తాకు విమానంలో వెళ్లారు. బ్రిటిషు, ఫ్రెంచి, ఆస్ట్రేలియన్ కన్సల్ లు సుమాత్రా పరిస్థితి పరిశీలించుటకు అక్కడకు వెళ్లినారు. బ్రిటిషు కన్సల్ ఒకరైన మలంగ్ ప్రాంతంలో కాల్పులు జరిగినవి గాని ఆయనకు దెబ్బ తగలలేదని వార్త ప్రకటించారు.

# 5 శతాబ్దాలనాటి దేవతా విగ్రహాలు

## రాజమంద్రిసమీపంలో బయల్పడిన వైనం

తూర్పు గోదావరి జిల్లా రాజమహేంద్రవరం తాలూకా శేరీ యర్రపాలెం గ్రామమునుంచి ఒకరు ఇట్లా వ్రాస్తున్నారు. ఆగస్టు 28 వ తేదీన ఈ గ్రామ పొలిమేరలో పశువుల కాపరులు ఆడుకొనుచుండగా భూమిలో కంచు విగ్రహాలు కనిపించాయి. పశుల కాపరులు ఈ సంగతి మునసబు, కరణం మొదలైన గ్రామ పెద్దలకు తెలియచేశారు. అందరు వెళ్లి ఆ ప్రదేశం త్రవ్వించగా కంచు విగ్రహాలు నాలుగూ, 3 గంటలు కూడా బయల్పడినాయి.

ఇంకా త్రవ్వుచుండగా ఒకరికి శ్రీ వెంకటేశ్వర స్వామి వారు ఆవహించి ఇంకేమీ లేవనీ, దొరికిన వాటిని గ్రామములోనికి తీసుకుపోయి ప్రతిష్ఠ చేయించి, ఆలయం కట్టించమని కోరారు.

అంతట ఆ విగ్రహాలను భజనలతో, మంగళ వాద్యాలతో ఊరిలోనికి తీసుకుపోయి, రామ మందిరంలో ఆట్టే పెట్టారు. రోజూ భజనలు జరుగుతున్నాయి.

కంచువిగ్రహాలు నాలుగింటిలో రెండు శ్రీ వెంకటేశ్వర స్వామి వారివీ, రెండు శ్రీ అలమేలు మంగతాయారమ్మ వారివీ. ఆ గంటలలో ఒకదానిమీద 1842 అనిన్నీ (బహుశా ఇది శాలివాహన శక సంవత్సరమై ఉంటుంది) రెండవదానిపై తెలుగు సంవత్సరమున్నూ ఉన్నాయి.

# కీ॥ శే॥ దువ్వూరిరామిరెడ్డి

## ఆచార్యరంగాసంతాపము

మదరాసు, సెప్టెంబరు 14. ఆచార్య రంగాగారు ఈ క్రింది ప్రకటన చేయుచున్నారు. శ్రీ దువ్వూరి రామిరెడ్డి గారు దివంగతులైనారంటే ఆంధ్రప్రజానీకం, కవులు, గాయకులు, విజ్ఞానులు విషాదమునందు మునిగిపోతున్నారు. శ్రీ రెడ్డిగారు రైతుబిడ్డ, స్వయంగా రైతు. విజ్ఞానులలో ప్రథమశ్రేణికి చెందినవారు. ఆధునిక ఆంధ్రకవులలో మకుటములేని సామ్రాట్టుగా క్రిందటి ముప్పది సంవత్సరములనుండి వెల్గుచుండినారు. వారు ప్రత్యేకంగా ప్రియమిత్రులు. వారి "కృషీవలుడు" నా రైతాంగ హృదయానికెంతో ఆనందము ఉత్సాహం ఆవేశము ఉద్రేకము కల్గించినది. వారి "మాతృశతకము" లోని పద్యములు మా రామాయణమునకెన్నోయేళ్లు చదివి వినిపించుచుండేవి ఎంతోగా దేశసేవారాధనయందు అనన్యబలము పొందుచుండెడివారము. వారి స్వరాజ్యరథముయొక్క దివ్యసందేశము మా "రైతుభజనావళి" హృదయానికి అగ్రమైనది. "కవికోకిల"యని మా యాంధ్రులు వారిని ప్రేమించుకొనిరి పిలుచుకొనిరి. వారి పుస్తకాలను ఇంగ్లీషులోనికి స్వయముగానారే కొన్ని, డాక్టరు కజిన్సు తర్జుమా చేసిరి. వారి పద్యాలను గీతాలను అమెరికన్ విజ్ఞానులు, కవీశ్వరులు ఎంతగానో మెచ్చుకొనిరి. రామిరెడ్డిగారితో నాకు పరిచయభాగ్యము కలదు.

వారికొక శాస్త్రీయమగు ఉపార, విచారము కలదు. క్రొత్త అంటే వారికిష్టము. నూతన శాస్త్రాలంటే వారికి ఉపార. ఎల్లప్పుడేదో క్రొత్త విషయములను తెలుసుకొంటూ ఉండే వారు. చూచేవారికి మా మిరటు రైతులాగ యుండేవారు. మాట్లాడేదానికి ప్రియ వాగ్రుడు. వారి హృదయం జీవిత ధోరణి ఆదర్శప్రాయమై ఆడంబరరహితమైన పంథాలంటె విహరించుచుండెడిది. అఖిల భారత విజ్ఞాన ప్రపంచమందు వారొక నక్షత్రము. అది రాలి సర్వవ్యాపకమగు జీవిత విశేషము, విజ్ఞతయందు లీనమై పోయినది.

నెల్లూరు జిల్లావారికి, ఆంధ్ర రైతాంగమునకు, ఆంధ్ర కవిశామ కల్పకు, ఇవే, ఆంధ్ర రాష్ట్రీ దేశభక్తులందరి తరఫున నా సానుభూతి తెల్పుకొనుచున్నాను.

ఆ పచ్చని పైరులు, పెద్దని గ్రామాల గాలి మెరుపులవెనకల్లా క్రొమ్మిడులవలెనే నాడు మా 'కవికోకిల' గానమేదా యన కొందురు. వారికిసూక్ష్మ నా సానుభూతి.

# గుంటూరు వర్తకుల సభ

## బట్టల వర్తకుని అరెస్టు

గుంటూరు, సెప్టెంబరు 12: శ్రీ చుండూరి హనుమంతరావు అను బట్టల వర్తకుని పోలీసువారు అరెస్టుచేసినందుకు పోలీసు వారి చర్యను అధిక్షేపించుచు గుంటూరులోని బట్టలవర్తకులు సభ చేసిరి. ఒక ఇన్స్పెక్టరుగారికి కావలసిన బట్టలు అమ్మలేదనే కారణంచేసి ఆయనను అరెస్టుచేసిరని సభలో పలువురు ఉపన్యసించిరి. ఈ విషయమై ఉ... గారి పున్నారావుగారు, డా॥ రాచపూడి వెంకటసుబ్బరావుగారు స్థానిక జిల్లా పోలీసు సూపరింటెండెంటు

# 'భారతదేశం శీఘ్రంగా పారిశ్రామికంగావలెను'

## శ్రీశరత్‌బోస్ విన్నపము

### అఖిలభారత పరిశ్రమల ప్రదర్శన ప్రారంభోత్సవము

విజయపురి, సెప్టెంబరు 15: "పాశ్చాత్య దేశాలతో పోల్చి చూచినపుడు ప్రస్తుతము మనదేశంలో వెనుకబడి వున్నాము. మనదేశము స్వాతంత్ర్య సంపదలతో తులతూగవలెనన్న విద్యుచ్ఛక్తిని గ్రామగ్రామమునకు పారునట్లుచేసి మనపరిశ్రమల శీఘ్రగమనమున పెంపొందింపవలెను" అని శ్రీ శరచ్చంద్రబోస్ గారు నిన్న సాయంత్రం ఆంధ్ర కాంగ్రెస్ ఆధ్వర్యమున ఏర్పాటు బడిన అఖిలభారత పారిశ్రామిక ఖాదీగ్రామ ప్రదర్శనమును కార్పొరేషన్ స్టేడియము నందు ప్రారంభించుచూ చెప్పిరి.

శ్రీ విజయరామగజపతి (విజయనగరం రాజా) స్వాగతము పలికిరి.

శ్రీ బులుసు సాంబమూర్తిగారు ఆంధ్ర కాంగ్రెస్ సంఘమువారు ప్రదర్శనమును నడుపుట కిచ్చిన తోడ్పాటును నుతించియు, దానిని జయప్రదముగా చేయుటకు శ్రమపడు ఉద్యోగులు, కర్మాగారులు అందరూ తోడ్పడవలెనని తెలిపిరి. శ్రీ శరత్ బోసుగారిని ప్రారంభోత్సవము జరుపకోరిరి.

శ్రీ శరచ్చంద్రబోస్ గారు ఉత్సవమును ప్రదర్శనమును ప్రారంభించుచూ ఇట్లు చెప్పిరి: "నేను 15 ఏండ్లవరకు ఆంధ్ర ప్రాంతమునకు చేరువనే ఉన్ననూ మీ ఆంధ్రభాషలో మాట్లాడలేకపోయినందుకు మన్నించవలెను. నాకు వచ్చిన ఏకో తెలుగుమాటలనిప్పుడు పూర్తిగా మరచిపోయినాను. మీరు నాకుచేసిన ఈ గౌరవమునకు కృతజ్ఞుడను. గత 30 ఏండ్లుగా నాయొక్క, మా నాయకులశక్తి యుక్తులు భారత దాస్యబంధవిమోచనపైనే లగ్నమైనందువల్ల మన పరిశ్రమలపైకి మరలించలేకపోయిమి. ఇటువంటి ప్రదర్శనములు ప్రజాదృష్టిని పరిశ్రమలపైకి మళ్లించుట కెంతయు తోడ్పడగలవు. ఉత్పత్తిదారులకు, పారిశ్రామికులకు విక్రేతలకు, వాణిజ్యపరులకు ఇదియొకటి స్థలము. ఎచ్చటెచ్చట ఏయే పరిశ్రమలు వ్యాప్తియగుచున్నవో తెలియగలదు. మనపర పరిపాలకులుఇంతకాలముగా భారతదేశము కర్షకదేశమేనని మన చెవులలో నూదిపోసినారు. కాని ఇది అర్ధసత్యమే. మన దేశము పారిశ్రామికముగ కూడా ఎంతో ప్రసిద్ధ ప్రాభవములందెనని యు, దూరదేశములకు కూడా ఎగుమతులు చేయుచుండెననియు మనకు విదితమే. మన పరిశ్రమలను మనపాలకులు నశిమ్పజేసినారు. నేడు మనకు సంపూర్ణ స్వాతంత్ర్యము రాలేదు. అధినివేశ స్వాతంత్ర్యమే వచ్చినది. బ్రిటిషు కామన్వెల్తులో మనము భాగస్వాములము. విశేష అధికారములు వచ్చుచుండగా, ప్రత్యేకముగానూ మనపైన ఇంకనూ ఉండెగలదు. అయితే ఇక మనము నిస్సహాయులమను పలుకులు చెప్పక, వచ్చిన అవకాశములను పూర్తిగా వినియోగించుకొనవలసియున్నది.

మనవిభుల మనము మరచిపోవుట మనకు సిగ్గుచేటు. 1936 లో నేతాజీ సుభాష్ బోసు అధ్యక్షులై ప్లానింగు కమిటీని నియమించి నెహ్రూను అధ్యక్షుడిగా చేయువరకు మనదృష్టి దానిపై పడలేదు. ఆ సంఘమువారి కృషి పూర్తిగా లేదు. కొన్ని నివేదికలను ప్రచురించిరి. వారిపని ఆగిపోయినది. ఆ కారణములు మీకు తెలిసినవే. అయితే ఇప్పుడు ఇండియా యూనియన్ ప్రభుత్వమువారు, అనగా పాకిస్తాన్, హిందూస్తాన్ వారలుగూడా తమ ధర్మమును గుర్తించి పంచవర్ష ప్రణాళికనొకదానిని ప్రకటించినచో త్వరలో దేశము కొన్ని ప్రగతిని పరిశ్రమల పెంపొందించగలరని ఆశించుచున్నాను.

మన దేశములో మోటారు కారులు తయారు చేసుకొనలేకున్నాము. పరదేశములో తయారైన హిందూస్తాన్ 10 లు కాదు మనకు కావలసినది. మనకారులు, మన విమానములు మనము తయారుచేసుకొనవలెను. రెండేడ్లబండి గమనములో నాకు నమ్మకములేదు. విద్యుచ్ఛక్తిని పూర్తిగా వినియోగించుకొని మనము వృద్ధిపొందవలెను.

పశ్చిమదేశము ఉత్తర దేశముకన్న ఖద్దరు ప్రశస్తి గాంచినది. అందునా ఆంధ్ర ఖద్దరు నాణ్యములో శ్రేష్ఠమైనదని మిన్న అందునది. నేను ఆంధ్ర ఖద్దరు మాకంతగా లభించుటలేదు. ఆంధ్ర ఖద్దరు ధరల ...

# "గ్రామాలలో రేషనింగ్ రద్దు కావాలి"

## పార్టీ సమావేశంలో కాంగ్రెస్ శాసనసభ్యుల కోరిక

మదరాసు, సెప్టెంబరు 15: మదరాసు అసెంబ్లీ కాంగ్రెసుపార్టీ రెండవనాటి సమావేశము నిన్న సాయంకాలం 4-30 గంటల నుండి రాత్రి 8-45 గంటలవరకు జరిగినప్పుడు ఆహార సమస్యగూర్చి చర్చింపబడెను. 150 మంది సభ్యులు హాజరయిరి. చర్చ రహస్యముగా నుండెను. నాచప్ప గౌండరుగారు, ధాన్యం ధరలు పెంచాలనియూ గ్రామ సీమలందు ఇంఫార్మలు రేషనింగు ఎత్తివేయాలనియూ సూచించినట్లు తెలియుచున్నది. మునుస్వామిపిళ్లెగారు బంగాళా దుంపల ఉత్పత్తిదారులంతా ఎగుమతి చేసుకొనేటట్లు అవకాశమిస్తు కంట్రోలు నిబంధనలు మార్చాలని కోరిరి.

శ్రీ బిక్కిన వెంకటరత్నంగారు గ్రామాలలో ఇంఫార్మలు రేషనింగు అనుకూలముగా జరుగుటలేదనియూ, పట్నాలలో రేషను తగ్గించినందున గిరాకి హెచ్చి, తల సైనుంచుకొని స్వేచ్ఛగా బియ్యం రవాణా చేసికొంటున్నారనియూ చెప్పిరి. నిరుడు కంట్రోలు ధరకు బ్లాకుమార్కెటు ధరకు అట్టే తేడా లేదు. కాని యీ యేడు బ్లాకుమార్కెటు ధర విపరీతంగా పెరిగిపోయింది. కనుక ఇంఫార్మలు రేషను రద్దుచేయుట గూర్చి జాగ్రత్తగ ఆలోచించాలి. ధాన్యసేకరణ యందు ఉదారీతి ప్రోత్సాహం చేయాలి గాని బలవంతంగా పోలీసువర్గ ఉపయోగించరాదని సూచించిరి.

పలనిస్వామి గౌండరుగారు ఇంఫార్మలు రేషనింగు తొలగించుటవలన రైతులకు ధర ఎక్కువ లాగబడరిరి.

ని. వెంకటసుబ్బయ్యగారు కర్నూలు జిల్లాలో జొన్నలు రాగులు లేకుండుట ప్రభుత్వం వారి కఠిన నియమాలవల్లనే ననియూ, జిల్లామధ్య గ్రామం గ్రామంకు రవాణా సౌకర్యాలు ఉండాలనియూ సూచించిరి. అన్నిజిల్లాలకు హెచ్చుగా బియ్యం పంచలేదనియూ, యితర జిల్లాలకు ఎక్కువయిచ్చి కర్నూలుకి 5000 టన్నులు మాత్రం యిచ్చిరనియూ తెలిపిరి.

అన్నామలైపిళ్లెగారు రేషని సు పద్ధతి సక్రమముగ తీసివేయరాదనియూ, గ్రామకమ్యూనిటు పెంటు పేరెంటులను ఎక్కువమంది నియమించి వారు సేకరించవలసిన పరకు ప్రమాణము తగ్గించాలనియూ కోరిరి.

శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు గ్రామసీమల రేషనింగు తీసివేయరాదని సూచించిరి.

ఎస్. ఎస్. వరదాచారిగారు సరకు రవాణా సౌకర్యాలు చాలవనిరి. ప్రస్తుతమున్న సరకు రవాణాలవలన సరిపోవుటకు 300000 టన్నులుండిన జనవరి వరకు సరిపోవును. రేషను కార్డులు తరుచు తనిఖీ చేయుచుండాలి. ఉత్పత్తిదారులకు కొన్ని అంకులు తగ్గించాలి. గొప్పవారు పొలం పండ్లు కొనగలరుగనుక, వారును రేషను తగ్గించుకొని యితరులకు మిగల్చవచ్చు. హోటళ్ళు మున్నగు వాటికి నాటిని రోజు తగ్గించుచున్నా పరమమిగల్చాలి. వ్యవసాయపు పంటలు తగ్గించి ధాన్యంపంటలు పెంచాలి. ఇంఫార్మలు రేషను తీసివేయరాదు. ధర పెంచుటంగూడా నిపుణుల అభిప్రాయాన్ని బట్టి చేయాలిగాని, అందు వలన తినేవారికి ధర పెంచరాదనిరి.

ఎం. ఎస్. నారసింగాను, ఉత్పత్తిని నియమించి నహాకార సంఘాలు గద్దెయుట తప్పనియూ, భూమిని ధాన్యంరూపంలో వసూలు చేయాలని, దొంగవ్యాపారాన్ని అరికట్టాలనియు సూచించిరి. ఎ. సుబ్రహ్మణ్యంగారు ధరలు పెంచాలనియూ, నారాయణ మీనను గారు రాష్ట్రమంతట రేషనింగు ఉంచాలనియూ, గోవిందస్వామి నాయుడుగారు కరువు నివారణకు ఎంతైనా ఖర్చు చేయాలనియూ, ఆంధ్రదేశములోని ఉత్పత్తిదారులు తమిళదేశంలో వారివలెనే ఆదనంగావున్న దంతా యిచ్చేయాలని ఎం. కన్నప్పగారును, వాణిజ్య పంటలు తగ్గించి వ్యవసాయ పంటలు పెంచాలని ఆర్. సుబ్బయ్యగారు ప్రసంగించిరి పార్టీసభ తిరిగి 16 తేదీ రాత్రి 7 గం॥ జరుగును.

మాన్నమల ప్రఖ్యాతిని గాంచగలదని ఆశించుచున్నాను.

కళలలోగూడా దక్షిణదేశ ప్రతిభ జగద్విఖ్యాతమైనది. మన కళలు, పరిశ్రమలు బాగుగా వృద్ధిపొందినగాని మన దేశము బాగుపడదు. హాయంత్ర సూర్యుని కిరణములు మాపై పడుచున్నవి. దక్షిణదేశ యువతీయువకులైన మీపైననే మీరే భారతనాగ్య సిద్ధతలు. ఈ భారము మీ భుజస్కంధములపైననే ఉన్నది."

శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు వారి ఉపన్యాసమును తెనుగులో చెప్పిరి. ప్రకాశం పంతులుగారు అభినందనము చెప్పించిరి.

ఆంధ్రమహిళాసభ విద్యార్థినుల జనగణమంగళగీతముతో సభ ముగిసెను.

గారిని నిన్న సాయంకాలము కలిసికొని మాట్లాడిరి. ఈ విషయమై దరియాప్తు చేస్తామని పోలీసు సూపరింటెండెంటుగారు చెప్పిరి.

పోలీసువారి రిపోర్టు ప్రకారం బట్టల రేషనుకార్డుమీద రేషను ప్రకారం యివ్వవలసినబట్ట యివ్వకుండా అక్రమముగా ప్రవర్తించినందువల్ల పదరు వర్తకుని అరెస్టు చేసిరి. తర్వాత జామీనుమీద కోర్టువారు ముద్దాయిని విడిచిపెట్టిరి.

నెల్లూరిజిల్లా సభలో ఎన్. జి. రంగాగారు ప్రసంగించుచు, ప్రకాశంగారు పట్టుకోట సభలో కఠినచర్య ఉపయోగిస్తామన్నమాట ఒకే ప్రాంతాన్ని ఉద్దేశించి చెప్పలేదన్నందుకు అభినందించిరనియూ, కేంద్ర ప్రభుత్వ చర్యను ఖండించి, అవసరమయితే శాసనసభ్యులంతా రాజీనామా లివ్వాలనియూ సూచించిరని తెలియుచున్నది. ఒకరు — ఎందుకు? కల్లూరి సుబ్బారావుగారు — మిత్రులతో కలిపి చెప్పుటకు అవసరికి రంగాగారు తమకి శాసనసభలో చేరాలను ఆశ లేదని చెప్పిరనియూ తెలియుచున్నది. ఇంతలో ఒక సభ్యుడు రంగాగారి పొలాలలోని పంట మిగిలినదంతా ప్రభుత్వానికి ఇవ్వలేదని సూచించే కాగితం ఒకటి రంగాగారికి అందజేసిరి. అందు రంగాగారికి, 26ఎకరాల 50 సెంట్ల పొలంలో 818 బస్తాలు పండి 90 బస్తాలు వ్యవసాయ ఖర్చులక్రిందపోగా, మిగిలిన 228 బస్తాలలో 50 మాత్రం విక్రయించిరని గలదు. రంగాగారి సోదరుడు గోగినేని లక్ష్మీనారాయణ గారికి పండిన 484 బస్తాలలో ఖర్చులకు 150 పోను, మిగిలిన 334 లో 129 బస్తాలమాత్రం విక్రయించిరనియూ తెలుపబడెను. రంగాగారు ఈ నిందకు బదులు చెప్పుతూ వ్యవసాయ వ్యవహారములు తాము చూడలేదనియూ, తమ భాగ్యతవరులు చూస్తున్నారనియూ, కూలీ లందరికి సరకు తాకట్టుగా ఇచ్చినందున ఆట్టే మిగిలియుండదనియూ చెప్పినట్లు తెలియుచున్నది.

# ప్రకటన

కడప జిల్లాలోని బద్వేల్ కర్నూలుజిల్లాలోని నాగ్నాపల్లె యందు మా ఆంధ్రపత్రిక, సచిత్రవార, భారతి మూడు పత్రికలను వారి స్వంతబాధ్యతపై విక్రయించుటకు శ్రీయుతులు పి. నరసింహయ్యగారిని 14-9-47 నుండి, మాచర్ల లక్ష్మయ్య గుప్తగారిని 7-9-47నుండి మా న్యూస్ ఏజంట్లుగా నియమించడమైనది.

**మేనేజరు**

ఆంధ్రపత్రిక, మదరాసు.

